# సూర్యుణ్ణి అందుకోవాలని.....

(కవితా సంపుటి)

శ్రీమతి చెళ్ళపిళ్ళ వెంకటరమణ

# ఆహ్వానం

..... సుమనశ్రీ

రమణాజీ కవిత్వం ఒక వలస జీవితపు బాధలోంచి ప్రారంభమైన కవిత్వం. మరీ ముఖ్యంగా తన భాషకీ, తనబంధువులకీ, తన మిత్రులకీ దూరంగా ఒక జైల్లాంటి మరోదేశంలో కాలం గడపటం ఎంత కష్టమో ఊహించుకోగలరనుకుంటాను. ఒక ఒంటరితనం. ఒక దిగులు. ఏదో తెలీని భయం, అభద్రత. అన్నిటికీ మించి అంతటా మనదిగాని తనం. మనదిగాని సంస్కృతి. మనదిగాని జీవితం.

అలాంటి వాతావరణంలోనే మొదలైంది ఆమె కవిత్వం. రమణాజీకి ఎక్కువగా మాట్లాడే వాళ్ళన్నా అతిగా వొకే విషయంమీద చర్చించే వాళ్ళన్నా వాళ్ళు మంట. ఊరికే రోడ్లు కొలుస్తూ సమయాన్ని వృథా చేసే వాళ్ళంటే గొప్ప విసుగు. బద్ధకంగా ఆవులిస్తూ బ్రతికే కవులంటే గొప్ప ఈసడింపు. గొప్ప ఊహలే వున్నా ఆమె పదహారణాల ప్రాక్టికల్ మనిషి. 'కవితా సంకలనాన్ని ఎవరికేనా అంకితమిస్తావా ?' అని అడిగితే 'నాకలాంటి సెంటిమెంట్లు లేవు' అని జవాబిచ్చింది. ఆమెని మోసగించడం చాలా కష్టం. ఎదుటి వాళ్ళ మనస్తత్వాన్ని చప్పున చదివేస్తుంది. దొంగలో దొరలో క్షణంలో తేల్చేస్తుంది. కవిత్వమూ అంతే. ఒకమూడ్‌లో రాసేస్తుంది. మళ్ళీమళ్ళీ దిద్దుళ్ళుండవు. కథలు రాసినా (దాదాపు ఇరవై), 'మంచు ముత్యాలు' నవల రాసినా ఆమె అలాగే రాసింది.

రమణాజీ కవితల నిండా వొకరకమైన 'మైమరచిపోయేతనం' కన్పిస్తుంది. ఒక 'నిండా మునిగిపోయే' తత్వం కన్పిస్తుంది. ఒక స్త్రీగా, ఒక నిండైన వ్యక్తిత్వంగల స్త్రీగా తన ఊహల్నీ, ఆలోచనల్నీ, ఆశల్నీ ఈ కవితల నిండా వెదజల్లింది. ఒక్కొక్కకవిత ఒక్కో మంచుశిల్పంలా రూపుదిద్దుకొంది.

పిల్లలిద్దరికీ ఆమె కవితలంటే ఎంతో ఇష్టం. హేమచంద్రకుమార్, వెంకట సురేష్‌బాబుల ప్రోద్బలంతోనే ఈ కవితా సంకలనం ఇలా వెలుగుజూస్తోంది.

సహృదయులు తప్పక ఆహ్వానించి ఆదరిస్తారని నా ప్రగాఢ విశ్వాసం.

# మనసులో మాట

కవిత్వమంటే నాకంత సదభిప్రాయం లేదు ముందునించీ. సుమనశ్రీ కవి అని తెలిసాక ఎంతగా కలతపడ్డానో మీకు ఎలా చెప్పను ? ఈ కవుల్ని నమ్మకూడదనే చెప్పేది మా అమ్మమ్మ. అమ్మమ్మంటే నాకెంతో ఇష్టం. తను స్వంతంగా మడిగా వండుకున్నవన్నీ దాచి రహస్యంగా నాకే పెట్టేది.

సుమనశ్రీతో ఉద్యోగరీత్యా కెనడా వెళ్ళినప్పుడు నాకు కష్టాలు మొదలయ్యాయి. పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయేవారు. సుమనశ్రీ యూనివర్సిటీకి వెళ్ళి తన పనిలో నిమగ్నమైపోయేవాడు. నాకేం తోచేదికాదు. ఇంట్లో పని అయిపోయేక ఆటవాలో అన్ని వీధులూ, షాపులూ సర్వే చేసేదాన్ని. నేను చేయగలిగింది ఘనమైన విండో షాపింగేకదా ! ఇంకా ఇంకా సమయం మిగిలిపోయేది. ఒక జైల్లో ఉన్నట్లుండేది. గుండెల్లో ఏదో దిగులు, కంగారు, భయం.

అయినా చుట్టూ అందమైన దృశ్యాలు. ప్రకృతి నన్ను ఆహ్లాదకరంగా పలకరించేది. చలికాలంలో మంచువర్షం కురిసి వెలిసాక చెట్లకొమ్మల మీంచి వేళ్ళాడే మంచుముత్యాలు నా మనస్సును పులకింపచేసేవి. ఆ తన్మయత్వంలో కాలాన్ని మరిచిపోయేదాన్ని. ఎవరికి చెప్పుకోవాలి ఈ అనుభవాలన్నీ. అలా రూపుదిద్దుకున్నాయి ఈ సంకలనంలోని అక్షరాలు. దీన్ని కవిత్వం అంటారో మరేమంటారో నాకు తెలీదు. అమెరికన్ కవయిత్రి Anne Sexton ని కూడా ఆమె సైకోథెరపిస్టు, కవిత్వం వ్రాయమని ప్రోత్సహించాడట. సుమనశ్రీ కూడా నన్నలాగే కవిత్వంలోకి తీసుకొచ్చాడు. నాకసలిదంతా ఇష్టంలేని వ్యవహారం. ఎప్పటినించో ప్రయత్నిస్తున్నాను. ఈ కవిత్వానికి ఏనాడో ఓనాడు విడాకులు ఇవ్వాలని. కుదరటం లేదు.

వ్రాసిన నాలుగు వాక్యాలూ దాచుకుందామనే అనుకున్నాను. ప్రచురించి పంచిపెట్టేస్తేనయినా నన్ను విడిచిపెడతుందేమోనని ఒక ఆశ. అందుకే ఈ ప్రయత్నం.

ఈ కవితలు ఇక మీవి. మీ ఇష్టం.

- చెళ్ళపిళ్ళ వెంకటరమణ

## ఇదీ వరస

# సూర్యుణ్ని అందుకోవాలని....

నూతన సంవత్సరం
తూరుపు తలుపుల్ని తెరుస్తోంది
నిన్న రాత్రి చెప్పావు
ఆకాశం మీద రేపు మనం
క్రొత్త సంతకాలు పెట్టాలని -
నా కళ్ళు రాబోయే
వసంత శోభల
ఇంద్రధనుసుల్ని కలగంటున్నాయి
రేపు మనం నూతన తారకు
మరచిపోకుండా
స్వాగతం చెప్పాలి
నెమ్మది నెమ్మదిగా
తూరుపు వాకిలి తెరచుకుంటోంది మరి -
గతించిన కాలం
తిరిగి రాదు గదా!
నిన్నటి జ్ఞాపకాల్ని
డైరీలో భద్రపరచుకుందాం
కాలంతో పరుగుపందెం

వృధా ప్రయాసే అన్పిస్తుంది
నేడు నిన్నలో కల్సిపోతూంటుంది
చిగురుటాశల రేపు
మిలమిలా మెరుస్తూ కన్పిస్తోంది
క్రొత్త సంవత్సరం
కోరికల్ని రేపుతుంది
నాకు మాత్రం -
నిరాశలో నమ్మకం లేదు
అందుకే ఆకాశంలోకి ఆశగా చూస్తున్నా -
ఎర్రటి సూర్యుణ్ణి
అమాంతంగా ఎలా మ్రింగాలా అని
తీవ్రంగా ఆలోచిస్తున్నా !

***(ఆంధ్రప్రభ డైలీ - 2-4-89)***

# ఉక్కపోస్తున్న రాత్రి

కన్ను పొడుచుకున్నా
కానరాని చీకట్లో
నీకళ్ళు రెండు నక్షత్రాలై
జీవిత రహదారిని
వెతుకుతుంటాయి
కీచురాళ్ళ మోతలో
కలలు తిరగమోతపెడ్తున్నాయి
కిటికీ సందుల్లోంచి
వెన్నెల పట్టుదారాలు
సాలెగూడులల్లుతున్నాయి
నిదుర రాక నీ శరీరం
మంచాన్ని కొలుస్తోంది
ఉస్సురుస్సురంటూ ఊపిరి
నిట్టూర్పులోదుల్తూంటుంది
పట్టుకుందామన్నా పట్టుబడని గాలి -
ఏ సుదూర తీరాలకు
వలసపోయిందో మరి !
గ్రీష్మాన్ని ఎదుర్కోలేక

చిగురుటాకుల్లా
అల్లాడిపోతున్నాయి శరీరాలు
చెట్లు విషాద సంగీతాన్ని
ఆలపిస్తున్నాయి
అగ్ని గోళానికి
ఆవలింతలెక్కువయ్యాయి
కిటికీలు తెరచినా
కర్టెన్లు ఊడబెరికినా
ఇసుమంత కూడ చిరుగాలి
శరీరాన్ని తాకటం లేదు
తడి తుండుగుడ్డ పైన వేసుకున్నా
ఏదో తెలీని దాహం, ఆర్తి, తపన
మంచం మీద మల్లెపూలు
మౌనంగా చూస్తున్నాయి
వేడిగాడ్పుల చలి మంటలు
తనివి తీరని ఒళ్ళుమంటలు
ఉయ్యాలలోని దేవుడు
ఫ్యాను గాలికి అల్లాడుతున్నాడు
నీవు మంచం
ఆరుబయట వేసుకున్నా -
నల్ల ముసుగులు, తెల్ల మబ్బులు
రెండు తలల నాగుపాములు
సంగీత సామ్రాట్టుల
సంగీత కచేరీలు
పద్మశ్రీల గానా బజానాలు

నల్లుల ప్రేమపాశాలు
నీకు పహారాకాస్తూంటాయి
పిచ్చి పిచ్చి ఆలోచనలతో
నువ్వు జుట్టు పీక్కుంటూనే వుంటావు
అరికాళ్ళ మంటలకి
అభిషేకాలు చేస్తూనే వుంటావు
తుండుగుడ్డ పదేపదే
స్నానం చేస్తూనే వుంటుంది
బొజ్జపైన జంద్యం
చిరాకు కల్గిస్తూంటుంది
కాని - తడారిన నీ కళ్ళల్లోకి
ఆకాశం జాలిగా
తొంగి చూస్తూనే వుంటుంది.

*(ఆంధ్రప్రభ వీక్లీ - 27-3-90)*

# రాత్రి పాఠశాల

రాత్రి పాఠశాలలో
నక్షత్రాలు పుస్తకాలు సర్దుకుంటున్నాయి
చంద్రం మాష్టారు
లీవ్‌లో వున్నప్పుడు
శుక్రుడు గారిదే అథార్టీ
ఆకాశం బ్లాక్ బోర్డువైపు
నువ్వు ఇనస్పెక్టరులా చూస్తుంటావు
లేటుగా వచ్చిన విద్యార్థిలా
గీతలు గీసుకుంటూ
పోతుందో జెట్ విమానం
మండు వేసవిలో
డాబా మీద పడుక్కొని
అంతులేని ఆకాశాన్ని
విసుగు విరామం లేకుండా
చదువుతుంటావు గదా !
నీకేమైనా అంతుపట్టిందంటావా ?
మబ్బుల పేజీల్ని తిరగేస్తూ
తెలియని కొత్త పాఠాలెన్నిటినో
తెలుసుకుంటూంటావుగదా !

ఏమైనా ప్రయోజనం వుందంటావా ?
తనివితీరని ఆకాశం
ఎప్పటికప్పుడు
వింత వింత సోయగాలతో
నీ కళ్ళ అద్దాల్లో తన ప్రతిబింబాల్ని
చూసుకుంటూనే వుంటుంది.
ఒక చల్లని పిల్లగాలి తెర
నీ మెడని సున్నితంగా తాకి
రివ్వున పారిపోతుంది చిలిపిగా -
ఒంటరిగా పడుక్కున్న నువ్వు
వ్యర్థ ప్రయత్నం అని తెలిసికూడా
నక్షత్రాల్ని వ్రేళ్ళమీద లెక్క పెడదామని
అవస్థలు పడుతూంటావు
ప్రియురాలి ముద్దులైనా
లెక్క పెట్టచ్చునేమోగానీ
నల్లని శరీరం మీది
తెల్లని పుట్టుమచ్చల్ని
లెక్క పెట్టటం వృథా ప్రయాసే మరి !

*(ఆంధ్రప్రభ వీక్లీ - 5-10-88)*

# నిద్ర

ఒంటరి తుమ్మని వెక్కిరిస్తూ
జంటగా ఆవలిస్తోంది నీ శరీరం
మబ్బు తెరల్లా నాట్యం చేస్తూ
మత్తుగా, మగతగా
నీ కనురెప్పల మీద
సోలిపోతూంటుంది
పసిపాపలా పారాడుతూ
ఒళ్ళంతా గిలిగింతలు పెడుతూ వుంటుంది
ఆవలింతల ఉయ్యాలలో
జోలలూపుతూంటుంది
చీకటితో చేయికలిపి
చెమ్మచెక్కలాడుతూంటుంది
అర్థరాత్రి అయినా
ఆరుబయటయినా
అందరిలోను నిన్ను
సిగ్గులేకుండా కౌగిలించుకుంటుంది

చిరుతపులిలా ఉరకలెడుతున్నా
చొంగలు కారుస్తున్నా
అసహ్యించుకోదు నిన్ను
పట్టుపరుపులయినా
రాళ్ళ గుట్టలయినా
చెట్టు నీడనైనా
చెత్తకుండీ ప్రక్కనైనా
మొహమాటం లేకుండా
నీ కంటిగువ్వల గూడులో

ఒదిగి పోతూంటుంది
అలసిన శరీరాన్ని
ఆత్మీయంగా అక్కున చేర్చుకుని
కన్నతల్లిలా తన ఒడిలో
సేద తీరుస్తుంది
నీకు తెలియకుండానే నీ కళ్ళని
హిప్నటైజ్ చేస్తూ కంటిగుహలలోకి
దూసుకుపోతూంటుంది
కంటి చక్రాల యిరుసుల్లో
ఇంధనంలా ఒరుసుకుపోతూ వుంటుంది
నిండుగా నవ్వుతూ
నిలువెల్లా ప్రాకుతూ

మత్తుయింజక్షను యిచ్చేస్తుంది
నిద్రలో నీ శరీరం
ప్రాణమున్న శవంలా
కదలాడుతూంటుంది
పిడిబాకు గుండెల్లో దిగినా
భూకంపాలు దద్దరిల్లినా
నాగుపాము కాటేసినా
క్షుద్రశక్తులు ఎత్తుకుపోయినా
పెనుతుఫాను వరదలై ముంచెత్తినా
నువ్వు తెప్పలా తేలిపోతావే తప్ప
తన టక్కరి వలలోంచి
నిన్ను మేల్కొనివ్వదు.

**(*'చైతన్య కవిత'లో ప్రచురింపబడింది. నెం. 7, శుక్ల వసంతం 1989*)**

# మేఘాల కన్నీటి ధారల్లో.......

మసిబారిన ఆకాశపు కారడవిలో
ఆకలిగొన్న సింహాల్లా గర్జిస్తున్నాయి
ఉరుములు, మెరుపులు
దారి తప్పిన మేఘ సమూహాలు
భయంతో గమ్యం తెలీని
లేడి పిల్లల్లా పరుగులు తీస్తున్నాయి
కాంతులు చిందే అందాల తారలు
ఏ దూర దేశాల గుహలలోతలదాచుకున్నాయో మరి !
మచ్చుకి ఒక్కటి కూడ కనపడటం లేదు
ప్రళయకాల రుద్రుడిలా
విలయతాండవం చేసే
సూర్యుడు కూడ ఉషాదేవి కౌగిట్లో తలదాచుకున్నాడు
అవినీతితో అక్రమంగా
దండెత్తి వచ్చిన శత్రువుల్లా
ఆకాశాన్ని చీల్చి చెండాడుతున్నాయి
మెరుపుల లేజర్ కళ్ళతో !
మేఘాలకన్నీటి ధారాల్లో
వాగులు, వంకలు
కొండలు, గుట్టలు

పుష్కరస్నానాలు చేస్తున్నాయి
తడిసిన చెట్లు, పక్షులు
రెక్కల్ని విదుల్చుకుంటున్నాయి
స్కూలు పిల్లలు పడవల్లో
ఇళ్ళకు చేరుకుంటున్నారు
బస్సులు, కార్లు, స్కూటర్లు
రయ్‌మని ఎర్రటి బురద పన్నీటిని
మనుష్యుల మీద చిమ్ముతూ
పారిపోతున్నాయి
రోడ్డుమీద డ్రైనీజీలు
యవ్వనపు పొంగుతో
నిండుగా నవ్వుతున్నాయి
తొందరగా యిల్లు చేరుకుందామనుకున్న నువ్వు
పంచరయిన స్కూటర్ని నడిపించుకుంటూ
ఇంటిముఖం పడతావు కసిగా.......!

*(ఆంధ్రప్రభ వీక్లీ - 27-7-88)*

# పాములు జలకాలాడుతున్నాయి

కలలో చీకటి రహదారి
నువ్వు ఒంటరిగా
ప్రయాణం చేస్తూంటావు
కళ్ళు మూసిన ఆకాశంలో
వెలుతురు లైట్లు
వ్రేలాడటం లేదు గదా !
కళ్ళని విప్పదీసుకుంటూ
అడుగుల్ని అటూ ఇటూ
పారేస్తూంటాయి నీ పాదాలు
దారినిండా కష్టాల కంకర రాళ్ళు
కాష్ఠాల చలి మంటలు
జర్రున జార్చే పాకుడుమెట్లు
తుమ్మ ముళ్ళు, పల్లేరుకాయలు
సుతిమెత్తని పాదాల్ని
హఠాత్తుగా హత్తుకుపోతూంటాయి
పాములు జలకాలాడుతుంటాయి
కీచురాళ్ళు చీకటి నృత్యానికి
తాళం వేస్తూంటాయి
రాబందులు నిన్ను నంచుకుందామని

వెంటపడి తరుముతూంటాయి
నీ శరీరాన్ని ఎవరో నొక్కేస్తుంటారు
ఊపిరి గొట్టాల్ని
పగులగొట్టేస్తుంటారు
మెరుపు కత్తులు నీ గుండెల్లో
దిగబడి పోతుంటాయి
చొక్కా చిరిగిపోయి
ఒళ్ళు గీరుకుపోయి
నీ శరీరం రక్తసిక్తమై
గులాబీ పాదలా నేలకొరిగిపోతుంది
నీ కళ్ళని రాబందులు
పొడుచుకు తింటుంటాయి
నువ్వు భయంతో
ఒక్కసారి ఉలిక్కిపడి
కళ్ళు తెరుస్తావు
ఎదురుగా కిటికీ కవతల
ఉదయం గుండెపగిలి
కక్కుతూంటుంది
గుక్కెడు రక్తాన్ని.

*('ఆంధ్రప్రభ' వీక్లీ - 8-3-89)*

# మంచులో కదుల్తున్న చిత్రాలు

అద్దాల కిటికీలోంచి
అందంగా అరవిరిసిన
అందమైన రెండు కలువలు
బయట ప్రపంచాన్ని
తూర్పార బడుతున్నాయి
మంచు గుట్టల్ని దాటుతున్న
పాదాలు జర్రున జారిపోతున్నాయి
కొలతలకు అందని
ఆకాశపు తెల్లని వస్త్రంలో
ప్రకృతి మంచు పిండిని
వస్త్ర కాళితం చేస్తోంది
గొంతునిండా విస్కీని పుచ్చుకుని
నల్లమందు తిన్న ఏనుగుల్లా
నిద్రపోతున్నాయి రోడ్డు ప్రక్కన
రంగురంగుల కార్లు
గడ్డకట్టిన మొహాలతో
మంచుకంబళ్ళను కప్పుకొని
ముణగదీసుక్కూర్చున్నాయి
గుబురు క్రోటన్‌మొక్కలు

శ్మశానవైరాగ్యంతో
బూజుపట్టి
నగ్నంగా నిలువెత్తు చేతుల్ని చాపుకొని
మౌనంగా నిలబడ్డాయి మేపుల్ చెట్లు
బక్కచిక్కిన గులాబీ కొమ్మ
మంచు చల్లదనాన్ని ఓపలేక
బరువుగా ఊగుతోంది.
దారి తప్పిన గువ్వల జంట
మంచు రెక్కల్ని విదుల్చుకుంటోంది
ఏ చెట్టు కొమ్మా ఆశ్రయం యివ్వటం లేదు
గుట్టలు గుట్టలుగా పడివున్న మంచుని
తట్టలు తట్టలుగా మోసుకుపోతున్నాయి
మునిసిపాలిటీ ట్రక్కులు
మంచు దుమారంలో
మసకమసకగా
కళ్ళు పొడుచుకు నడుస్తున్నాయి
చెట్టు తొర్రలోని నల్ల ఉడుతల జంట
చెంగుచెంగున
ఓసారి బయటకు వచ్చి
విచిత్రంగా చుట్టూ కలయచూసి
తుర్రున లోపలకి జారుకుంటోంది
కలువలు కరిగిపోయాయి
గాజు కిటికీ శూన్యంగా.....
తప్పిపోయిన సూర్యుణ్ణి
వెతుక్కుంటోంది మౌనంగా....

*('తెలుగుతల్లి'లో ప్రచురింపబడింది - 1988)*

# మునిమాపువేళలో

ఆకలి తీరని కడుపుకి
అమ్మ ప్రేమకూడా కరువైనట్లు
ఉడుకు రక్తం వేడిలో
ఇల్లు వదిలిన చిన్న కొడుకులా
ఏం చేయాలో తెలీక
కళ్ళు మిటకరిస్తోంది ఆకాశం
ఆకాశం కంటినీడలో నిలబడి
మనం పండిన జీవితాన్ని చేత్తో పట్టుకుని
అనుభవాల పేజీల్ని తిరగేస్తుంటాము
వెండి పట్టు దారాల బుట్టలోంచి
నల్లవెంట్రుకల్ని ఏరుతుంటాము
పావలా డబ్బులకోసం
వయసుకి మించిన బరువుని
మోసుకుపోతూంటాము
పట్టు సడలిన ప్రక్కటెముకలు
ఎండిన రక్తసముద్రంలో
తడిని తడుముకుంటూంటాయి
ఆకాశంలో పిల్లమేఘ సమూహాలు

పిల్లిగంతులేస్తూ -
వలస పోతుంటాయి
ఆకాశం కనుపాపలో
వెలుతురు దీపాలకోసం
వెతుకుతూంటాయి
చమురులేని ప్రమిదల్లాంటి
మన కళ్ళు -
గోడలకి వ్రేలాడుతున్న బూజులా -
వాలుకుర్చీలో అసహనంగా
అటూ ఇటూ కదుల్తూంటాయి
రిటైరైన మన శరీరాలు.
విశ్రాంతి కూడ వెగటు పుట్టిస్తోంది
ఒంట్లో నిస్సత్తువ
వయసుని రెండెట్టి హెచ్చిస్తోంది.

*('రచన' మాసపత్రికలో ముద్రింపబడింది)*

# కవిత్వం

పదాల ఎండుపుల్లల్ని ఏరుకుంటూ
కవిత్వపు గూడు అల్లుకుందామని
ఆత్రంగా పరుగులెడుతోంది ఓ కవి పక్షి
ఎండిన కొమ్మల దారాలు
మంచు ముత్యాల దండల్ని
గ్రుచ్చుతూంటాయి
మోడువారిన చెట్లకొమ్మల్లో
గూడుకోసం వెతుకుతూంటుంది ఓ ఒంటరి పిచ్చుక
రిటైర్‌మెంటులేని సూర్యబింబం
కడలికెరటాల్లో ఆత్మహత్య చేసుకుంటూంటుంది
నీ చూపుల్లో ఆకాశం
రంగులు మారుస్తూనే వుంటుంది
నీ ఖాళీ మస్తిష్కంలో
బాల్యపు చిహ్నాలు
బొంగరంలా తిరుగుతూంటాయి
రెండు పెదవుల మధ్య ఓ చిర్నవ్వు
రెండు కంటి నక్షత్రాల్లో ఓ ప్రేమపిలుపు
కొండచిలువలా దూసుకుపోయే నల్లని రోడ్డు
పరుగుపందెంలో అలసిన
అతి సామాన్య సీతాకోక చిలుక
నీ చొక్కా స్వేదసువాసనల్ని
ఆస్వాదించకలేక
గిర్రున ఎగిరిపోతుంది.



శ్రీమతి చెళ్లపిళ్ల వెంకటరమణ

# రోడ్డు మీదకు రాకు

రోడ్డు మీదకు రాకు
అన్యాయంగా బలైపోతావు
అడ్రసు లేని శవాల్లో కల్సిపోతావు
రాజకీయపు ముఠాతగాదాల్లో
మతకల్లోలాల మారణహోమాల్లో
గూండాల రాజ్యంలో
రాబందుల కబంధహస్తాల్లో
నువ్వు సమిధవైపోతావు
మహానగరంలో హాయిగా
ఊపిరిపీల్చాలనుకుంటున్నావా ?
బాహువులు విరుచుకుని
స్వేచ్ఛగా తిరుగుదామనుకుంటున్నావా వెర్రివాడా !
ఎప్పుడు ఏ రాజకీయ శక్తులు
విజృంభిస్తాయో తెలీదు
ఎప్పుడు ఏ రౌడీ మహారాజు మెదడు
నడిరోడ్డు మీద

పగుల్తుందో తెలీదు
కాల తారతమ్యం లేకుండా
బస్సులు, రైళ్ళు
ఎప్పుడు భోగిమంటలేసుకుంటాయో, తెలీదు
కేసుల్లేని పోలీసుల చేతుల్లో
ఎప్పుడు ఎముకలు
విరగ్గొట్టుకుంటావో తెలీదు
అర్థరాత్రి ఆడది తిరిగేరోజు రాకపోయినా
మగాడు తిరిగే రోజు కూడ వుండటం లేదు
కిడ్నాపులు, రేపులు, మిస్సింగ్స్
హత్యలు, ఆత్మహత్యలు, కత్తిపోట్లు
ఇవన్నీ అతిసాధారణ విషయాలే
గాలిలో ఎగిరే ధూళి కణాలే !
అందుకే -
రోడ్డు మీదకు రాకు
అన్యాయంగా బలైపోతావు.

('అభిజ్ఞ'లో ప్రచురింపబడింది)

# గూర్ఖా

అర్ధరాత్రి దాటితే
నీ కళ్ళకి కునుకే వుండదు
చేతిలోని లాఠీతో
ప్రతి గేటు చప్పుడుచేసుకుంటూ
నీ తలపుల తలుపుల్ని మూసేస్తూ
ముందుకి సాగిపోతూంటాయి - నీ కాళ్ళు
ఆమె నిద్రపోతూంటుంది
నీ కళ్ళు ఈ ప్రహారీలో వున్న
ఇళ్ళని కాపలా కాస్తూ
వీధి వీధీ తిరుగుతూంటాయి
నాకు తెలుసు -
నీ మధుర స్మృతులు, బాల్యచిహ్నాలు
నీ కాళ్ళకి బంధాలు వేస్తూ
మెరుపులా మెరుస్తూంటాయని.....
నీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
వేడి నిట్టూర్పులొదుల్తూంటాయి
రెప్ప మూస్తే నీ జీవన భృతి
జర్రున జారిపోతుంది

ఏ రాత్రి నీ కంటికి నిదురేది చెప్పు ?
ఆకాశపు వలలో చుక్కల చేపలు మెరుస్తూంటాయి
మానససంద్రంలో ప్రేమ కెరటాలు
నీ గుండెని ఢీకొంటూనే వుంటాయి
గత స్మృతుల సమాధుల్లోంచి
తీసి జ్ఞాపకాలు జెండాల్లో
నీ గుండెని చుట్టేస్తూంటాయి
నీ కళ్ళు మాత్రం ప్రతి యింటిని
కాపలా కాస్తుంటాయి
చల్లని వెన్నెల రాత్రులు
ప్రేయసిని గుర్తుచేస్తూ
అగ్నిజ్వాలల్ని రేపుతూంటాయి
ప్రేయసికౌగిల్ని నీ చిరుగుల కోట్లో
ఊహించుకుంటూ
మంచులో తడిసిన చెట్టులా
కదలిపోతూంటావు
చుక్కలు, మిణుగురులు నీ నేస్తాలు
గబ్బిలాలు, గుడ్లగూబలు
నిన్ను పలకరిస్తూంటాయి
తెల్లవారు ఝాములు నీకు రాయబారులు
వెచ్చని రాత్రులు ఇంద్రధనుస్సులు
గుడిలో గంటలు
నీ గుండెల్ని పిలుస్తూంటాయి
నీ దేవుని గుడిదగ్గర
పారిజాత పరిమళాలు,

మల్లెల సువాసనలు తప్ప
ఏ దుర్గంధాలు దరికి రావు
ఏ స్త్రీ ఆర్తనాదాలు వినపడవు
ఈ రాత్రి చాల ప్రశాంతంగా వుంది
ఆమె నిద్రలో వుంది
నీ కలల్ని ముక్కలు ముక్కలుగా చేస్తున్నారు ఎవరో
రాత్రి ప్రసవించింది
పగలు ఉదయించింది
బూడిద రంగు ధూళి
చెట్లపై చల్లబడినట్లు
నీ కలలు మసకబారి పోయాయి
నీ కళ్ళ ముందే పురాతన కట్టడాలపై
బంగారపు బాణాలు గుచ్చబడ్డాయి
రాబోయే పాట ఓ సూర్యకిరణంలా
మెరుస్తోంది నీ మస్తిష్కంలో !

*("ఆంధ్రప్రభ" వీక్లీ - 4-12-91)*

# వెన్నెలా..... వెన్నెలా.....

ఆకాశ గర్భంలోంచి జన్మించిన వెన్నెల

అవనిపై తన అందాల్ని ఆరబోసుకుంటున్నా -

ఇసుక తిన్నెలపై దిగంబంరంగా ఒళ్ళు విరుచుకుంటున్నా -

పూరి గుడిసెల్లో స్వేచ్ఛగా వెలుగుల్ని విరజిమ్ముతున్నా -

కొబ్బరాకుల్లోంచి కొంటెగా తొంగిచూస్తున్నా -

కన్నెపిల్లలకి కన్నుకొడుతూ

కవుల పదబంధాలలో

కలబందగా మారినా

పచ్చపువ్వులా వెల్లివిరిసినా

పసిపాపలా పారాడినా

పాలనురుగులా ప్రవహించినా

పట్టుదారాల సాలె గూళ్ళు అల్లినా

అదేం విచిత్రమో !

నామానసాకాశంలో మాత్రం అంతా చీకటే

అస్తవ్యస్తమైన ఆలోచనల్తో

అంతా గందరగోళమే !

# సతి(సహ)గమనం

అందాలపూదోటలో వెల్లివిరిసిన
సుగంధ సువాసనల సిరిమల్లెవు నువ్వు
పుప్పొడి వత్తిడులకే
కందిపోయే ఎర్ర గులాబీవి
ఏడుగురి అన్నలకు
ముద్దుల చెల్లివైనావు
మనసిచ్చి ప్రేమించిన భర్తకు
ముద్దులొలికే ముద్దబంతివైనావు
రెండు వసంతాలయినా
చవిచూడకుండానే
నీ నుదుటి కుంకుమ
ఆకాశాన్ని హత్తుకుపోయిందా ?
ఎంత చిత్రమైన విధీ ?
మతమౌఢ్యాలకు
మూఢాచారాలకు
బానిసలయిన ఈ జనం
నిన్ను అగ్నికి ఆహుతి చేసారా ?
ఆ క్షణాన నీ సున్నిత హృదయం
ఎంతటి ఆవేదనకు గురయ్యిందో

నేనూహించలేను తల్లీ !
అపురూపంగా పెంచిన
అన్నల హస్తాలే నీకు
అగ్నిపరుపులు పరిచాయా చెల్లీ !
నీ ప్రాణాల్ని కాపాడలేని
ఈ మూర్ఖపు మనుష్యులు -
నీకు కోవెల కట్టి
అనునిత్యం కాపలాకాస్తారుట -
పూజలు చేస్తారుట
ఎంతటి వెర్రి ప్రేమో నీమీద
నీ పేరుని సువర్ణాక్షరాలలో
చరిత్రలో లిఖిస్తారుట
ఎంతటి దయార్ద్ర హృదయులో!
చూసావా తల్లీ
నా బంగారు చిట్టి చెల్లీ !
ఈ ఘోర కృత్యాన్ని ఆపడానికి
రాజారామ్‌మోహన్‌రాయ్
కందుకూరి వీరేశలింగం
లేరు తల్లీ ! రాలేరు మళ్లీ !

('రూపకన్వర్' మరణవార్త చదివి)

## వ్యాప్త్యాళి

నీలం దుప్పట్లో రెండు కళ్ళు
కాంతులు చిందే చెకుముకిరాళ్ళు
ఏ కళ్ళతో చూసినా
ఒక కన్నే కనబడుతుంది
నలక పడ్డ కన్ను నారింజపండు
మబ్బుల తొక్కల్ని వలుస్తూ
ఒళ్ళు విరుచుకుంటోందాకాశం
చిప్పిల్లిన కాంతిరసంతో
పగలు నగ్నంగా హొయలుపోతోంది
చెదిరిన రోడ్డుపై
నిన్నటి రక్తపు మరకలు
ఒలికిన కిరసనాయిలు వాసనలు
రోడ్డుప్రక్కన -
గ్రుడ్డివాడి రేపటి ఆకలి పోరాటం
ఇవన్నీ నీ కళ్ళలో కదుల్తూన్నా
నీ కళ్ళు మాత్రం తెలియని వాటికోసం
వెతుకుతూ ముందుకి దూసుకుపోతూంటాయి.

# ఉదయకిరణం

చీకటి సముద్రంలో
చేపలు మెరుస్తున్నాయి
ఆకుల సముద్రంలో
పక్షులు ఎగురుతున్నాయి
రక్తపు పంజరంలో
ఎముకలు కదుల్తున్నాయి
ఓ అద్భుత ప్రపంచమా !
అంతా చీకటి గుహే !
అయినా మనం -
జీవితపు వెలుగులోకి పయనిద్దాం !

# వసంతాగమనం

గున్నమామిడి చిగురుల్లో
కోయిలమ్మ కొత్త నాదాలు చేస్తోంది
వేపతరులు నిండుగా ముస్తాబయ్యాయి
ప్రకృతి కన్య నూతనోత్సాహంతో
వసంతునికి స్వాగతం చెబుతోంది
శిశిరం శిరసువంచి
వసంతానికి షేక్‌హేండ్ యిచ్చింది
బంతులు, చేమంతులు కనుమరుగయ్యాయి
మల్లెలు, విరజాజులు
మగువల కురుల్లో చేరి
మత్తుగా నవ్వుతున్నాయి
శిశిరానికి ఒళ్ళప్పగించిన శరీరాలు
చిరుచెమటల్ని చవిచూస్తున్నాయి
మోడువారిన చెట్లు
నూతన వస్త్రాలతో నిండుగా ముస్తాబయ్యాయి
వగరు, తీపి, చేదు, పులుపు
రుచుల సమ్మేళనంతో ఉగాది పచ్చడి -
మానవాళికి జీవితానుభవాల్ని
అర్జంటుగా గుర్తుచేస్తోంది
వసంతాగమనాన్ని తెలుపుతూ
నాలికపై ఒయ్యారాలు పోతోంది.



# వాడు

వాడి దారిలో ఉన్నంతకాలం
నీతో కలసి వస్తానంటాడు
నీవు ఏది అడిగినా లేదనడు
మనసు విప్పి మాట్లాడుతాడు
అల్పీదగ్గర్నుంచి అణుబాంబు వరకు
గంటల తరబడి
నీతో ముచ్చటిస్తాడు
రాజకీయాల దగ్గర్నుంచి మతాతగాదాల గురించి
ఏకగ్రీవంగా ఉపన్యాసాలిస్తాడు
నిన్ను తన గ్రూపులోవాడిగా నిర్ణయిస్తాడు
ఇతర పార్టీల గురించి
నీకు హితబోధ చేస్తాడు
'కామత్'లో ప్రేమగా
ఫ్రీగా మసాలా దోశ యిప్పిస్తాడు
ఇంటికెళితే గుత్తివంకాయ కూరతోను
బంగాళాదుంప వేపుడుతోను
కొత్తిమీర వేసిన సాంబారుతోను
ఆప్యాయంగా భోజనం పెడతాడు
పెరట్లో పండిన పళ్ళను

నీకు కానుకగా యిస్తాడు
కానీ -
నీకు ఒక ప్రత్యేకమైన దారి వుందని
నీకు నలుగురిలోనూ
మంచి పలుకుబడి వుందని
మనసు విప్పి మంచిగా
అందరితోను కల్మషం లేకుండా మాట్లాడతావని
నువ్వు తనకుపయోగపడవని
నీ దారి వాడి దారి కాదని
తెలిసిన వాడు - వాడు
నీవు కనపడినా కనపడనట్లు
తనదారిలో నడుస్తూ పోతాడు
మాటవరసకు నీవు పల్కారించినా
కళ్ళెక్కడో దాచుకుంటూ
బల్లిలానో, పిల్లిలానో వాడు
జారుకుంటూ పోతాడు.

అటు శ్మశానవాటిక
ఇటు వివాహ వేదిక
అటు కన్నీటి తలంబ్రాలు
ఇటు పన్నీటి తలంబ్రాలు
అటు ఏడుపులు పెడబొబ్బలు
ఇటు నవ్వులు హాస్యాలు
అక్కడ వల్లకాటికి అప్పగింతలు
ఇక్కడ అత్తవారింటికి అప్పగింతలు
అక్కడ దానాలు, మంత్రాలు
పువ్వులు, పసుపు, కుంకుమ, అక్షతలు
మేళాలు, తాళాలు, నిప్పుల కుండ -
మరి యిక్కడ -
యంత్రాలు, పువ్వులు, పసుపు - కుంకుమలు
అక్షతలు, అగ్ని గుండం
బాజా భజంత్రీలు, గానా బజానాలు
అక్కడ మనిషి పాడె ఎక్కుతాడు
ఇక్కడ మనిషి పల్లకీ ఎక్కుతాడు
పల్లకీ ఎక్కినా
పాడె ఎక్కినా
మోసేది మనుష్యులే
చివరికి చేరేది వల్లకాటికే !

# ఎముకలగుహలో ఎర్రదీపం

చిక్కని రక్త సముద్రంలో
చిక్కువీడని ఎర్రని
పట్టుదారాల మధ్య అర్ధచంద్రాకారంగా
తపస్సుచేస్తూ నిద్రపోతూంటావు
మూడునెలల దాకా రక్తపుముద్దవు నువ్వు
ఆరవ నెలకు ఆకారాన్ని దాల్చి
చిగురులు వేస్తూంటావు
అమ్మ ఊపిరితో ఆకలి తీర్చుకుంటూంటావు
ఎముకలగుహలో ఎర్రదీపానివి
అమ్మా నాన్నలకు ఆశాకిరణానివి
అరుణోదయంలో ఉదయించే
ఎర్రగులాబీవి నువ్వు
నీ చిరుపాదాల తాకిడికి
అమ్మమనసు
ప్రేమతో పులకించిపోతుంది
ఆ ఆనందంలో క్షణంసేపు
ఉచ్ఛ్వాస నిశ్వాసాల్ని కూడ
మరచిపోతుందా వెర్రితల్లి

నువ్వు బంధవిముక్తుడవు కావాలని
ఆరాటపడ్తూంటావు
నీది మరో ప్రపంచం
హింస, ద్వేషం, అసూయ
మతకల్లోలాలు, మారణహోమాలు
రాజకీయపు కుతంత్రాలు
ఇవేమీ తెలియవు నీకు
అమ్మఒడిని చేరాలని
పండువెన్నెల్ని ఆస్వాదించాలని
మల్లెల సౌరభాలతో మాట్లాడాలని
ప్రేమానురాగాల్ని చవిచూడాలని
ఉవ్విళ్లూరుతూంటావు
ఈ ప్రపంచంలోకి అడుగిడాలని
అశ్రులుచాస్తూ, ఆరాటపడ్తూంటావు కాని -
నువ్వింకా కళ్ళు తెరవని పసిగుడ్డువే !

# గ్రీష్మం

రోహిణి వెంటపడగా
అందని ఆకాశంలోని సూర్యుడు
కొండల్ని కౌగిలించుకుంటున్నాడు
పచ్చసముద్రాలు ఆవిరై
ఎండుటాకుల గలగలలమధ్య యింకిపోతున్నాయి
చెకుముకి రాళ్ళు చేరువై
చలిమంటలు వేసుకుంటున్నాయి
ఒంపుసొంపులు కరిగిపోయిన
పిల్లకాలువ గులకరాళ్ళ మధ్య
తేమను వెతుక్కుంటోంది
దాహంతో నోరెండిపోయిన కుండలు
కుళాయిల వద్ద క్యూలో
సొమ్మసిల్లి నిద్రపోతున్నాయి
ఉక్కపోతలో ఉడికిపోతున్న
పచ్చనిచెట్లు వేడినిట్టూర్పులతో
ఊసులాడుకుంటున్నాయి
ఎడారిలో ఒయాసిస్సులా
కనపడే బోరింగుపంపులు

నీకు ఉచితంగా సూది మందుని
చురుక్కున వేస్తూంటాయి
మర్డరు చేసిన కిల్లర్‌లా
ఆకలి మంటల ఆర్తనాదంలా
అగ్నిప్రమాదానికి ఆహుతైన అబలలా
గుక్కెడు నీటికోసం అల్లాడిపోతూ
మండుటెండలో -
సముద్రపు తియ్యదనాన్నైనా
ఆస్వాదిద్దామని
ఆశగా అర్రులు చాస్తూంటుంది గ్రీష్మం.

# వసంతానికి ఆహ్వానం

ఆకలిగొన్న సింహంలా
అరుస్తున్న సముద్రంలో
బలిసిన కొండచిలువలు
పోటీపడి ముందుకి
దూసుకువస్తున్నాయి
సాగరతీరంలో సంధ్యాసమయం
మరిడెమ్మ జాతర చేసుకుంటోంది
రక్తపు మడుగులో విలవిల్లాడుతున్న
సూర్యుణ్ణి చూసి చెట్లపై పక్షులు
పిచ్చిగా అరుస్తున్నాయి
పర్వతాలమీదుగా మంచు
కన్నీరు కారుస్తోంది
యాపిల్‌చెట్టు కొమ్మల్లో
వేయి సూర్యపుష్పాలు ప్రకాశిస్తున్నాయి
ఆకాశం చప్పరిస్తున్న పిప్పరమెంటు
తొంగితొంగి చూస్తోంది
చలిగాలులు శరీరాన్ని నంజుకుంటున్నాయి
నీవు అతిశీతలాన్ని
నిందిస్తూనే వుంటావు ఎల్లప్పుడూ
జాలిలేని శీతలం ముందు
నిర్దోషిగా చేతులు కట్టుకుని
నిలబడింది వసంతం
నీవు వసంతం కోసమే
మళ్ళీ మళ్ళీ ఎదురుచూస్తుంటావు.

# ఆకాశపు పందిరి మీంచి.....

ఆకాశపు పందిరిమీంచి
జలజలారాలుతూ -
తుంటరి పిల్లగాలులతో
చేయి చేయి కలుపుకుంటూ
సుడిగుండంలా గిరికీలు కొడుతూ
తెగిన ముత్యాల సరాల్లా ధరిత్రి తాకుతూ
ఆవిరైపోతూంటాయి మంచు పుష్పాలు
చెదిరిన రోడ్లు
పగిలిన బీరు సీసాలు
ఎండిన మ్రానులు
కిటికీ అద్దాల వెనుక
మంచు గుట్టలలో
మకమసకగా కనపడ్తూంటాయి
ఎదురింటి కిటికీ కర్టెన్ల వెనుక
నీలినీడలు ఒరుసుకుంటూ
ఒదిగిపోతూ ఒకటిగా కదుల్తూంటాయి
మసకబారిన నీ కళ్ళు
విచ్చుకత్తుల్లా విచ్చుకుంటూంటాయి
వంగిపోయిన నడ్డెముక నరం

ఒక్కసారి కలుక్కుమంటుంది
పాల వెన్నెల వెండి పరదాల వీధులలో
మంచుబంతులను విసురుకుంటూ
పరుగులు తీస్తుంటారు అల్లరిపిల్లలు
కళ్ళవాకిళ్ళలో ఎటుచూసినా
మంచు వానలు
మంచు గీతాలు
మంచు సంగీతాలు
మంచు హృదయాలు తప్ప
మనసారా ఆత్మీయంగా మాట్లాడే
ఒక్కగొంతు కూడ కనపడదు నీకు
యాంత్రికమైన జీవనగమనంలో
గడ్డకట్టిన ఐస్ ముక్కల్లా
జారుకుంటూ పోతూంటాయి శరీరాలు
ఇదంతా చూస్తూ -
నిలువెత్తుగా మోడువారిన
వేయి చేతుల యాపిల్ చెట్లు
చిరుగాలికి తలలెగరేస్తుంటాయి
మీకంటే మేమే నయం అన్నట్లు.........!

# కోమాలో సూర్యుడు

మంచుకుబుసాన్ని విడిచిన
నాగుపాములా నీలాకాశం
వసంతస్నానాల్ని చేస్తోంది
మంచులో మ్రగ్గి బక్కచిక్కి
మౌనంగా నిలబడి నిర్జీవంగా
చూస్తున్న చెట్ల కొమ్మలు
పదహారేళ్ళ పడుచులా
తొలి యవ్వనంలోకి అడుగిడుతూ
అరమోడ్పు కన్నులతో చిలిపిగా
తిరిగిచూస్తున్నాయి
నదీజలాలలో పగిలిన మంచుపలకలు
తెప్ప తిరునాళ్ళు చేసుకుంటూ
ముందుకి జారిపోతున్నాయి
మంచుతుఫానులో చిక్కుకుపోయిన
హంసల జంట
హనీమూన్ ప్రయాణానికి
సంసిద్ధమవుతూ -
పచ్చిక పరుపుల్ని వెతుక్కుంటున్నాయి

'కీ'యిచ్చి వదిలిన ఆటబొమ్మల్లా
ఓ ఉడుతల జంట చెట్లకొమ్మలపై
కోతికొమ్మచ్చులాడుతూ -
వ్యాహ్యాళికి పోతున్న
తెల్లకుక్కపిల్లని చూసి
కొంటెగా వెక్కిరించి
తుర్రున పారిపోతోంది
కోమాలో వున్న సూర్యుని వాలు చూపులు
వేయి బంగారు చేతులతో
వసంతాన్ని ఆహ్వానిస్తున్నాయి.

# ఆకాశపు గొడుగు క్రింద

నువ్వు మంచు తుఫానులో
చిక్కుకుపోయినప్పుడు -
ఆకాశపు గొడుగుకూడా
నీకు ఆసరా యివ్వదు
కొండల్ని కూడ గడ్డకట్టించే చలి
నీ శరీరాన్ని అత్మీయంగా హత్తుకుంటుంది
నరనరం జివ్వున లాగుతూంటుంది
నీకు తెలియకుండానే అరికాళ్ళు
తిమ్మిర్లు ఎక్కుతుంటాయి
చేతులు పట్టుతప్పుతుంటాయి
ముక్కుమీద కళ్ళజోడుకి
స్పర్శే వుండదు
గోళ్ళు గిల్లుతుంటాయి
మెడకు చుట్టిన 'మఫ్లర్లు'
హుక్కా పీలుస్తూంటాయి
కళ్ళు వుండి కూడ నీవు -

గ్రుడ్డివాడిలా తడుముకుంటూ నడుస్తూంటావు

నీవు ఉన్ని బట్టలు ధరించినా

నీకు గోరువెచ్చదనాన్ని కూడ యివ్వలేవు

ఆకాశంలో అగ్నిగోళం

మండుతూనే వుంటుంది

నీవు వడివడిగా యిల్లు చేరకపోతే

శిలవైపోతావు మధ్య దారిలో - !

*('తెలుగుతల్లి'లో ప్రచురించబడింది.)*

# స్నోఫాల్

గ్రీష్మతాపానికి గురయిన
తరులతలకు చల్లని మంచు
గంధాలను జల్లుతోంది ఆకాశం
మంచు తెల్లగా, మెత్తగా
పసిపాప నవ్వులా
పుప్పొడి జల్లులా
వెన్నెల తిన్నెలా
ముత్యాలజల్లులా వుంటుంది
అప్పుడప్పుడు ఫుట్‌పాత్‌లపై
పంచదారపాకంలా
పేరుకున్న నెయ్యిలా
విరిగిన పంచదార చిలకల ముక్కల్లా
రేషన్‌షాపుల్లో బరకపంచదారలా....
అంతేకాదు -
పాప్‌కార్న్ పుష్పాల్లా
సగ్గుబియ్యపు గింజల్లా
మనకాళ్ళకి అడ్డుపడుతూ
మనకళ్ళల్లో కరిగిపోతూంటుంది,
ఇళ్ళకప్పులు, చెట్ల తుప్పలు

గడ్డకట్టుకుపోతూ మంచు ప్రవాహాల్లో
జలకాలాడుతుంటాయి
తొలిచూలు గర్భిణీస్త్రీలు
అడ్డు ఆపులేని పిండిమరలా
ఆకాశం -
మంచుపిండిని
కక్కుతూనే వుంటుంది
అంతిమదశలో అలసిన
మంచు గుట్టలు మట్టితో
మచ్చిక చేస్తూ -
రంగు వెలసి, త్రుప్పుపట్టిన
శిలావిగ్రహాల్లా -
కాల్చేసిన సిగరెట్టు బూడిదలా
రంగులు మారుస్తూ
ముందుకి కరిగిపోతూంటుంది
అద్దాలకిటికీలోంచి
అందంగాను, ఆహ్లాదంగాను
మనసుని రంజింపచేస్తుందీ స్నోఫాల్ -
ఆరునెలలు నిత్యం మంచే -
మంచే జీవితమైతే మాత్రం
ఆత్మహత్యాసదృశ్యమే ప్రతిక్షణం -

# మంచు దుమారంలో......

నువ్వు రోడ్డుమీద నడుస్తూన్నప్పుడు
ప్రకృతి అంతా మసకమసకలా కన్పిస్తుంది
తెల్లని స్ఫటికాల్లాంటి మంచుపురుగులు
నిన్ను సుడిగుండంలా చుట్టుకుపోతుంటాయి
కోమాలో వున్న చెట్లు
మంచు ఆవిర్లను పారద్రోలుతూంటాయి
అడుగులు పడటం కష్టంగానే వున్నా
మంచు బురదల్ని దాటుకుంటూ
భారీశరీరాల్ని మోసుకుపోతూంటాయి కాళ్ళు -
బజారులోని షోకేసుల్లోని
అందాల బొమ్మలు కన్నుకొడుతూ
నీకు స్వాగతం పల్కుతూంటాయి
కాని - పర్సు వెర్రి మొహం వేసుకుని
జేబుని హత్తకుపోతూంటుంది
నల్లకోట్లు, ఎర్రటైలు, వేనిటీ బేగ్‌లు
హడావిడిగా పరుగులు తీస్తూ
జన సముద్రంలో కల్సిపోతూంటాయి
గొడుగులు ఎగురుతుంటాయి

అడుగులు తడబడిపోతుంటాయి
పెదాలు తడారిపోతుంటాయి
గుండె గడియారం కొట్టుకుంటూనే వుంటుంది
కుక్కపిల్ల వెంట పడుతూంటుంది
పడుచుపిల్ల కిసుక్కున నవ్వేస్తుంది
చెట్టు తొర్రలోని ఒంటరి ఉడుత
జంటకోసం రోడ్లమీద
పరుగులు తీస్తూంటుంది
మంచు దుమారంలో
కళ్ళు నులుముకుంటూ
పారిపోతూంటావు ముందుకి.

# నిశ్శబ్ద సంగీతం

నా ఒంటరితనం
నన్నుక్కిరిబిక్కిరి చేస్తుంటుంది
గమ్యం లేని ఎడారిలా కన్పిస్తుంది
నా మనసు మౌనంగా రోదిస్తూంటుంది
చెట్లమధ్య నుండి వచ్చే
చల్లని పిల్లగాలి
నా శరీరాన్ని సవరిస్తూంటుంది
అడుగుల శబ్దాలు
ఎండుటాకుల గలగలలు
నన్నుభయపెడ్తుంటాయి
హాయిగా నవ్వాలని ఉన్నా
నవ్వలేకపోతున్నా.
తెలియని బాధ నన్ను వెంటాడుతూంటుంది
ఒంటరితనానికి
అలవాటుపడిన నేను
ప్రకృతిని కూడ ఆనందించలేకపోతున్నా.

# మంచులో వసంతం

ఉగాది గురించి వ్రాద్దామని
కలం పట్టిన నాకు
ఏమి వ్రాయాలా అని సందేహమొచ్చింది
ఎందుకంటే యిక్కడ
గున్నమామిడి చెట్లు లేవు
చిగురుటాకుల మధ్య
కోయిల కంఠాలు లేవు
వెలగపండ్లు లేవు
కనుచూపు మేరలో
పచ్చ సముద్రాలు లేవు
పక్షుల కిలకిలారావాలు లేవు
తుమ్మెద ఝుంకారాలు లేవు
సువాసనలు వెదజల్లే
మల్లెలు, జాజులు, లిల్లీలు లేవు
కవి సమ్మేళనాలు లేవు
సాహిత్యగోష్ఠులు లేవు
ఎండిపోయి మంచు కప్పబడిన
చెట్ల మ్రానులు తప్ప -
స్పందన లేక కరడుగట్టిన హృదయాలు
యాంత్రికమైన జీవితాలు -
మమతానురాగాలు లేని
మనుష్యుల మధ్య
గడ్డకట్టిన మంచుకొండలలో
మౌనంగా వసంతం ఘోషిస్తోంది.

# ఆనంద దీపాలు

చిరు చిరునవ్వుల దీపాలు
జ్వలిత నేత్రకాంతుల దీపాలు
సిరిసిరిమువ్వలు దీపాలు
విరిసిన వెన్నెల దీపాలు
    ఆకాశంలో తారల్లాగ
    మిలమిల మెరిసే దీపాలు
    మా ఆశల దీపాలు
    మాయని మమతల దీపాలు
సన్నజాజుల పరిమళాలతో
ఇల్లంతా విరబూసే
తెల్లని మల్లెల దీపాలు
ముంగిట ముత్యాల దీపాలు
    ఆటలలో పాటలలో
    అలసిసొలసి
    అమ్మమ చేరిన దీపాలు
    అల్లరి నవ్వుల దీపాలు
    స్వాతి జల్లుల దీపాలు

సరిగమ పాడే దీపాలు
నవ్వుల జల్లుల దీపాలు
అల్లరి పిల్లలు దీపాలు
మాయామర్మం తెలియని దీపాలు
పాల వెన్నెల దీపాలు
పసిడిమొగ్గల దీపాలు
పగడపు నవ్వుల దీపాలు
శతకోటి కాంతుల దీపాలు
దేవుని ప్రతిరూపాలీ దీపాలు

("ఆంధ్రజ్యోతి" వీక్లీలో ప్రచురింపబడింది.)

# మంచు కురుస్తున్న రాత్రి

ఆకాశపు పరుపుని ఏకుతోంది శీతల ప్రకృతి
ఎగిరివస్తూన్న మంచు దూదిపింజల్ని
ధరిత్రి తన ఒళ్ళోకి ఏరుకుంటోంది
నిశిరాత్రిలో భూమ్యాకాశాలు
ముద్దుగా మంచువెన్నెల్ని ఆహ్వానిస్తున్నాయి
చంద్రుణ్ణి కోల్పోయిన ఆకాశం
చుక్కల చేతిలో చిక్కుకుపోయింది
దారితప్పిన చంద్రుడు
పట్టువీడని నల్లని మబ్బులతో
దొంగాటలాడుతున్నాడు
గున్నఏనుగుల్లాంటి కార్లు రోడ్డు ప్రక్క మంచుపొదర్లను
మోహాలకి పులుముకుంటున్నాయి
అంబరాల్ని అందుకునే మేపుల్ చెట్లు
కదల్లేని శిలల్లా నిలబడి చూస్తున్నాయి.
నీ కళ్ళు కిటికీ రెప్పల్లోంచి
రోడ్లపై యవ్వన చుంబనాల్ని

కార్ల కౌగిలింతల్ని గుచ్చిగుచ్చి చూస్తుంటాయి
ఇంట్లో ఉన్న నీకు కాళ్ళుచేతులు
చల్లబడి, నరాలు పట్టుతప్పుతుంటాయి
ఇవన్నీ చూస్తున్న నువ్వు
నీకు తెలియకుండానే
పెన్ను కేప్‌ని నమిలేస్తుంటావు
టేబుల్‌పై గడియారం చప్పుడు, చేస్తూనే వుంటుంది
గాలికి కర్టెన్లమీద నాగుపాములు
బుసలు కొడుతూనే వుంటాయి
దీపకాంతుల నీడల్లో సాలెపురుగు గూడు అల్లుతూంటుంది
నిద్రరాని నీ మనసు
రోదిస్తూంటుంది ఒంటరిగా....

# జ్ఞాపకాల మొక్కల్ని ఏరుకుంటూ....

మంచుప్రవాహాల్లో
జలకాలాడుతున్నాయి నీ కళ్ళు
నువ్వు మంచుపత్రలలో ఈదులాడుతూంటావు
శ్వేతవర్ణపు మేలిముత్యాలు నీ శరీరాన్ని అలంకరించుకుని
నిను  హిప్నటైజ్ చేస్తూంటాయి
రోడ్డుపై వాహనాలు కన్నుకొడుతూ
రఁయ్‌మని నీ కళ్ళని దూసుకుపోతూంటాయి
బరువెక్కిన డోనట్ శరీరాలు
జర్రున జారిపడ్తుంటాయి
మంచుగాడ్పులలో నీ కళ్ళు మసకమసకగా మండుతూ
గరగరలాడుతుంటాయి
అకాల మరణంలో ఆకాశం
అంతట్లోనే భోరుభోరున ఏడుస్తుంది
చలిలో ఒంటరిగా నడుస్తున్న నీవు
నిన్నటి జ్ఞాపకాల మొక్కల్ని ఏరుకుంటుంటావు
ప్రియుని మునివ్రేళ్ళ స్పర్శ గుర్తుకురాగానే
నీ ఒంట్లోని నరాలు
జివ్వున ఒక్కసారి స్పందిస్తాయి
బాల్య స్మృతులు నిన్ను గిలిగింతలు పెడ్తుంటాయి

కాయ్యబారిన ఇళ్ళపైకప్పులు
కిటికీలను మూసుకుని
ధూమపానం చేస్తుంటాయి
సప్తవర్ణపు ఇంద్రధనుస్సులు
నీ కళ్ళకు అడ్డుపడి ఉక్కిరిబిక్కిరి చేస్తుంటాయి
నీవు మనోధైర్యంతో అడుగులు లెక్కపెడుతూ
ముందుకిసాగిపోతుంటావు.

# బయోడేటా

| | | |
|---|---|---|
| పేరు | : | శ్రీమతి చెళ్ళపిళ్ళ వెంకటరమణ |
| అడ్రసు | : | ఫ్లాట్ నెం 121, ప్లాట్ నెం. 3, కల్యాణ్‌నగర్<br>సంజీవరెడ్డినగర్ పోస్ట్, హైదరాబాద్ - 38 |
| అర్హతలు | : | B.A. (Political Science) (A.U.)<br>M.A. (Political Science)<br>(Dr. Ambedkar Open University) |
| పుట్టిన తేదీ | : | 30-9-1952 |
| వయస్సు | : | 46 సం॥లు |
| రచనలు | : | మొదటి కవితా సంకలనం<br>"సూర్యుణ్ని అందుకోవాలని"<br>కథలు, వ్యాసాలు |
| కథలు | : | పన్నెండు |
| వ్యాసాలు | : | ఎనిమిది |
| నవల | : | మొదటి నవల - మంచుముత్యాలు (అముద్రితం) |
| అభిరుచులు | : | సాహిత్యసమావేశాలలో పాల్గోటం,<br>కవిత్వం, కథలు చదవటం, వ్రాయటం. |



సుమనశ్రీతో ఉద్యోగరీత్యా కెనడా వెళ్ళినప్పుడు నాకు కష్టాలు మొదలయ్యాయి. పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయేవారు. సుమనశ్రీ యూనివర్సిటీకి వెళ్ళి తన పనిలో నిమగ్నమై పోయేవాడు. నాకేం తోచేదికాదు. ఇంట్లో పని అయిపోయేక అట్టావాలో అన్ని వీధులూ, షాపులూ సర్వే చేసేదాన్ని. నేను చేయగలిగింది ఘనమైన విండో షాపింగేకదా ! ఇంకా సమయం మిగిలిపోయేది. ఒక జైల్లో ఉన్నట్లుండేది. గుండెల్లో ఏదో దిగులు, కంగారు, భయం.

అయినా చుట్టూ అందమైన దృశ్యాలు. ప్రకృతి నన్ను ఆహ్లాదకరంగా పలకరించేది. మంచుముత్యాలు నా మనస్సును ఊరించేవి. ఆ ఊహల్లో కాలాన్ని మరిచిపోయేదాన్ని. ఎవరికి చెప్పుకోవాలి ఈ అనుభవాలన్నీ. అలా రూపుదిద్దుకున్నాయి ఈ సంకలనంలోని అక్షరాలు. దీన్ని కవిత్వం అంటారో మరేమంటారో నాకు తెలీదు.